ఓమ్ తత్సత్

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః





# దశరథరామ శతకము

ముష్టికో వెల

వైష్ణవం నరసింహదాసుచే రచితము.

చిన్నపల్లి పల్లాసుబ్బయ్యగారి

ద్రవ్య సహాయమువలన ముద్రింపబడినది.

1931.

వెల. 0—3—0.

# విజ్ఞప్తి.

---

ఆర్యులారా! నేనాంధ్ర భాషాభ్యాసన కాలము నుండి శ్రీ అనంతకల్యాణగుణధాముండగు నయ్యిందిరారమణుని సుందర చరణారవిందంబు లనిశభక్తిచే నిరంతరము గొలుచుచు శ్రీరామచరిత్రలఁజదువుచు నాశక్తి కొలఁది భజన సల్పుచు నితరులెవ్వరేని తారకనామస్మరణంబు జేయుచున్న కర్ణానందంబుగా వినుచు కాలంబుగడుపుచు నొక్కనాఁటి రాత్రి నరసింహశతకంబు సాంగంబుగా జదివిపరుండియుండ నాగాఢనిద్రయందు శ్రీ సీతారామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు గాన్పింప వారల దర్శించి నమస్కరించి, మేల్కాంచి శ్రీరామ దర్శనంబునకు సంతసించితిని. ఆశతకంబు భక్తిపూర్వకంబుగా జదివి నందు కిదికదా సార్థకంబనియును అయిన నేనిట్టి శతకంబు నొకదానిని రచియించిన నాజన్మసాఫల్యంబు గల్గుగదాయను ధ్యాసగల్గియు ఛందోలక్షణంబు నెరుంగని కారణంబున కొంతకాల మూరకుంటిని. తరువాత నాయభీష్టంబు నెరవేర్ప భక్తపరాధీనుండగు నా శ్రీరాముండు బంపెనేమో యనునటుల,

చం॥ వరసుకవీధురీణ ఘన • వాగ్విభవోజ్జ్వలు భాస
మాను సుం • దరతరసద్గుణాంబునిధి • ధారుణ యోగ
సమాధినిష్ఠుఁడున్ • గరుణవహించు నాపాలికి • గ్రా
మనివాసుఁడు నారణార్యుఁడున్ • తిరముగ మద్గృహం
బునకు • తీవ్రముగా జనుదేర మ్రొక్కితిన్॥

ఇట్లు పాలికి బ్రహ్మశ్రీ చితంబరదీక్షితులవారి ప్రియ శిష్యుండగు బ్రహ్మశ్రీ ఆదినారాయణార్యులు నా స్వ గృహంబున కరుదేర నమస్కరించి నాయభీష్టంబు దెల్పి విని వారువల్లెయని నాయం దనుగ్రహించి ఛందస్సురీతిగా పద్యక్రమంబు కొంత యుపదేశించిరి. కావున వారికి పదివేలువందనము లాచరించెద. తరువాత సీ దశరథరామశతకంబును, గొన్ని హరికథలను రచియించితిని. అందలి వ్యాకరణ ఛందోలక్షణంబులు పరిచూడ పండితులైనవారలకు జూపం దలంచి యొక్కనాడు పరమ భక్తాగ్రేసరుండైన,

శా॥ కస్తూరీయుఁడు నారణార్యకవిని • గాంక్షించి నే
వేడ గా • నుల్లాసంబున గ్రంథముగ్ గొనియు
తా • నుత్సాహియై పద్యముల్ • తెల్లంబొప్పగ జూ
చి నామదికి మేల్ • దెల్పంగ బోధించియున్ • సల్లాపం
బున నాకొసంగిన గురున్ • సద్భక్తిచే మ్రొక్కెదన్॥

ఇట్లు అనంతపురం ట్రైనింగుస్కూలు తెలుగు పండితుల

వారగు బ్రహ్మశ్రీ కె. వేంకట నారాయణరావుగారీ శతకమంతయుఁ జూచి అందుఁగొన్నిటిని సవరించి ఈ శతకము మొదటి పుటయందు యీ కవనము ద్రాక్షాపాకముతో లలితముగానున్నదని వ్రాసి త్వరలో అచ్చొత్తించవలెనని నాకొసంగిరిగాన వారికి అహర్నిశంబులయందు వందనము, లాచరింపుచుండెద నేను బీదవాఁడయుండుట యెల్లరకు దెలిసియు దైవంబు ద్రవ్య సహాయంబు జేయుటకు నాప్రియ మిత్రుల కూడా బుట్టింపనందున యూరకుండిరి. అంతలో,

సీ॥ శ్రీరమ్యమై ధరణ • జెన్నొందుచున్నట్టి
చిన్నపల్లె యనంగ • శ్రీశపురిని
చౌడాంబకృపగల్గి • చెలఁగి పుష్పాండజ
మునిగోత్రి యుక్తుండు • ముఖ్యతముఁడు
సుజనసంసేవితు • సుగుణోజ్వలవిలాసు
డందమూతొగట కు • లాబ్ధిచంద్రు
డౌ పల్ల వంశాఖ్య • డను ధర్మశీలుండు
ప్రేమ సుబ్బయ్యయన నామధుర్యు

గీ॥ డిమ్ముమీరంగ యీ శత • కమ్ము జూచి
అచ్చొత్తించి కీర్తియు • హెచ్చు గాంచె
గాన శ్రీరాముడే వేళ • కరుణతోడ
పుత్రపౌత్రాభివృద్ధిచే • బ్రోచు గాత॥

రాజ రాజేశ్రీ చిన్నపల్లి పట్టాసుబ్బయ్యగారి ద్రవ్య సహాయమువలన నీ గ్రంథము నచ్చొత్తించి ఆంధ్రలోకమున కొప్పగించితిని గావున వారికీర్తి ఆ చంద్ర తారార్కముగా వర్ధిల్లుగాక. తక్కిన హరి కథలుకూడా త్వరలో అచ్చొత్తించుటకుగాను దైవ మునుగూర్చి ప్రార్థించుచున్నాడను. ఈ శతకము కేవల పండితజ్ఞానులకంత పాత్రత గాకున్నను బాలురకును వృద్ధులకును పామరులకును అక్షర హీనులకును జ్ఞానమార్గ దర్శకంబుగను పారాయణంబునకు నుపయుక్తంబుగానుండు నని ఈగ్రంథము రచియించితిని ఇందలి తప్పులను తెలియ జేసిన పండితులకు వందనశతంబాచరించి ముందు ముద్రణమున సరిద్దుకొందునని కేలుమొగిచి ప్రార్థించుచున్నాడను.

ఇట్లు,

భగవద్దాసాను దాసుడు

వైష్ణవం నరసింహ్మదాసు,

నూష్టికో వల

---

ఓం తత్సత్

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః

# దశరథరామ శతకము.

---

సీ॥ శ్రీకర గోవింద ♦ సేవిత మునిబృంద
భోగీంద్రశయన యం ♦ భోజనయన
నీలాభ్రసమదేహ ♦ నిరత ఖగరాడ్వాహ
కరిరాజ వరపాల ♦ కనక చేల
భువనమోహన రూప ♦ భూపాలకుల దీప
నిఖిలైక మాం రక్ష ♦ నీరజాక్ష
దానవకుల భేద ♦ దాసపూజిత పాద
నవతౌలసీ ధామ ♦ నవ్యకామ.

గీ॥ మహిని కీర్తిప్రభాభాస ♦ మందహాస
శ్రీ హృషీకేశ పరమాత్మ ♦ శ్రీనివాస
వివిధమణిహార మౌక్తిక ♦ వేల విహార
రమ్యగుణసాంద్ర దశరథ ♦ రామచంద్ర.

సీ॥ సకల జీవసుకర్మ ♦ సంసిద్ధిదము గాదె
రామ నీనామ పా ♦ రాయణంబు
సర్వ వేదశ్రుతి ♦ సాంప్రదాయము గాదె
రామ నీనామ పా ♦ రాయణంబు
లోకపాలన కళా ♦ నీకమైనది గాదె
రామ నీనామ పా ♦ రాయణంబు
సుజ్ఞాన మొసగెడి ♦ సుశ్లోకమును గాదె
రామ నీనామ పా ♦ రాయణంబు.

గీ॥ రమ్యపదవిచ్చు నీదు పా ♦ రాయణంబు
బాయ కెప్పుడు భజియింతు ♦ భక్తితోడ ॥సివిధ॥ ౨

సీ॥ శ్రీరామ నిన్ను నే ♦ సేవించి శతకంబు
జేయబూనితినయ్య ♦ చెల్వుమీర
అస్మన్మనస్థల ♦ మందు నీవు వసించి
దోష గుణంబుల ♦ దూలనేసి
నీదు కారుణ్యంబు ♦ నెఱయ నాయెడనుంచి
నిశ్చలంబుగ బుద్ధి ♦ నిల్పియుంచి
ఊహావిలాసంబు ♦ లిచ్చి యొప్పుగ జిహ్వ
భవ్యవాక్సుధలతో ♦ బాగు పరచి

గీ॥ కృతుల నొనగూర్చి నీదు సం ♦ స్తుతుల దెల్పి
భారవుభారంబు నీదె యో ♦ భోగి శయన ॥సివిధ॥ ౩

సీ॥ దండంబు దేవ కో ♦ దండమండిత శూర
మండలాధిప దైత్య ♦ ఖండ నీకు
నందనంబిదె యర ♦ విందజనార్దన
నంద కంద శ్రితేష్ట ♦ బృంద నీకు
జోహారు రిపుజన ♦ గాఢాహవభంజన
బాహాబలోద్దీప్త ♦ దేహ నీకు
జేజేలు రాజాది ♦ రాజ స్తుతివిరాజ
రాజార్చితాంఘ్రి పం ♦ కేజ నీకు

గీ॥ నధికసాష్టాంగములు రమా ♦ నాథ నీకు
బహు నమస్కారములు భక్త ♦ పాల నీకు ॥వివిధ॥ ౮

సీ॥ శ్రీవరా రఘువంశ ♦ ధీవరా నినుగొల్తు
గావరా నాదగు ♦ భావమందు
మొక్కితి నీభక్తి ♦ జిక్కితి నీస్మృతి
జొక్కితి నీకునే ♦ దక్కితయ్య
శూరుడా నే నహం ♦ కారుడా యతిదుర్వి
చారుడా ననుబ్రోవు ♦ మేరుధీర
భండనా దైత్యేశ ♦ ఖండనా దుర్జన
దండనా నీవు నా ♦ యండనుండి

గీ॥ ఘ డధరుబాధమాన్పియుం ♦ దడయ కిపుడు
ఖండితంబుగ ననునేలు ♦ కమలనయన ॥వివిధ॥ ౯

సీ॥ నీ నివాస స్థలి ♦ నిటలంబు సోకంగ
బాయక దండంబు ♦ జేయ డేని

నీ నామధ్యానంబు ♦ నిజముగా మనమున
సరసతో సంస్తుతి ♦ సల్ప డేని

నిత్యకృత్యంబులు ♦ సేవిగా మది నెంచి
ప్రీతితో నీకు న ♦ ర్పింప డేని

నిర్మల హృదయుడై ♦ నీ పాదకమలంబు
మక్కువ చింతన ♦ మరగ డేని

గీ॥ తెంపుమై విన్ను పూల పూ ♦ జింప డేని
అందమైనట్టి పరసుఖ ♦ మంద గలడె. ॥వివిధ॥ ౬

సీ॥ ధృత ధారుణీధర ♦ నుతి జేతు శ్రీవర
పతితపావన రామ ♦ భక్త ప్రేమ

చండాంశు ప్రభ తేజ ♦ నీడారు వరభోజ
పండితాఖిల రామ ♦ భక్త ప్రేమ

ప్రజ్ఞావిచక్షణ ♦ సుజ్ఞాని రక్షణ
పాపసంహార రామ ♦ భక్త ప్రేమ

దైత్యాది మదభంగ భృత్యాత్మ ఘనభృంగ
పంకజోదర రామ ♦ భక్త ప్రేమ

గీ॥ పలువిధంబుల వేడెద ♦ భక్త ప్రేమ
భజన జేసెద శ్రీరామ ♦ భక్త ప్రేమ. ॥వివిధ॥ ౭

సీ॥ శ్రీధరాధీశుండ ♦ సేవిత వంద్యుండ
చండ మార్తాండ కో ♦ దండ ధరుడ
లాలిత కాంచీక ♦ లాపశోభిత కటి
సూత్రాంకితుడ ధవళ ♦ చత్రి ధరుడ
హార కేయూరుండ ♦ ఆశ్రితపోషక
శ్రీకర పీత కౌ ♦ శేయధరుడ
సుకపోలతలుడును ♦ సుందరా కారుండ
నరుణావలోక నో ♦ ష్ఠాణ ధరుడ

గీ॥ వైన యినవంశతిలకని ♦ న్ననవరతము
నామమదియందు ధ్యానింతు♦నమితముగను ॥ద్విధ॥౮

సీ॥ శంఖంబు బల్విరా♦టంకమై పూరించి
శృంఖాళి నెల్లను♦సుక్క జేసి
చండాంశు తేజ భ♦వాండంబు లదురగా
నిండారు చక్రంబు♦నియతి దాల్చి
షౌంకంబుగా దైత్య♦బింకంబు లణగించి
క్రూరాత్మకుల నెల్ల♦గూల్చివైచి
సత్యంబు నెరపియు♦నిత్యంబుభక్తుల
కత్యంతముగ సౌఖ్య♦మమర జేసి

గీ॥ నట్టి నిపుణుండవగు నిన్ను♦ననవరతము
మానసంబున గొల్తునో♦మరువకెప్డు ॥ద్విధ॥ ౯

సీ॥ ఏలనో రక్షింప♦వేలనో ననుగావ
దేలనో దుర్గుణ♦జాలమతినొ
పాపినో నేకర్మ♦రూపినో కష్టదుఃఖ
వ్యాపినో వరమనో♦రోపినేనో
దుష్టనో బహుళని♦కృష్టనో అధికక
ర్మిష్టనో నీచవృ♦త్తిష్టనేనొ
క్రూరనో శిష్టజన♦దూరనొ కామవి
చారనొ మరియహం♦కారమతినొ

గీ॥ జ్ఞానమింతయు లేని అ♦జ్ఞానమతినొ
బూని నన్నేలుమింకను♦బుణ్యపురుష ॥వివిధ॥ ౧౦

సీ॥ వైభవజయ వేష♦వైకుంఠపురివాస
వాసవార్చిత భక్త♦వనధిలోల
లోల భాసురవదన♦జాలమేలర నీకు
నీకు మ్రొక్కితిరార♦నిగమ వినుత,
నుతభక్త దరహాస♦జత మహాంహోబృంద
బృందావన విహార♦భువనకృపణ
ఫణిరాజశయన నవ♦మణిహారధారణ
రణభీకరా కార♦గుణనిధాన

గీ॥ దానవాంతక నేను నీ♦దాసుడయ్య
అయ్య ననుబ్రోవ నీవెగ♦దయ్య రామ ॥వివిధ॥ ౧౧

సీ॥ ఏయుత్తమశ్లోకు ♦ దలచి ధర్మజునకు
స్వర్గానుభవ భూతి ♦ సొంపుజూపె
యేపురుషశ్రేష్ఠు ♦ దెంచి భీము ప్రతిజ్ఞ
నెరపి పరాక్రమ ♦ నెగరజల్లె
యేజగన్మోహనుం ♦ డింపొంద పార్థునన
కాహవంబున జయో ♦ త్సాహమిచ్చె
యేలీల మానసు ♦ వలన పాంచాలిక
నక్షయంబగు వల్వ ♦ లమరగల్గె
గీ॥ అట్టిజగదీశ నీదు పా ♦ దాంఘ్రిస్మరణ
మరువకెప్రుడు జేతునా ♦ మనమునందు ॥వివిధ॥ ౧౨

సీ॥ ఘోరసంసారమ్మ ♦ వారాశికిం దెప్ప
నీనామమేకదా ♦ నీలదేహ
కర్మమేఘమ్ముల ♦ నదలించుటకు గాని
నీనామమేకదా ♦ నీలదేహ
మోహంబనే లత ♦ మొదలుదుంప శరమ్ము
నీనామమేకదా ♦ నీలదేహ
మదమను గజమును ♦ మరలించు సింహంబు
నీనామమేకదా ♦ నీలదేహ
గీ॥ ఇంతబలమైన నామంబు ♦ సంతతంబు
నాదు మదియందు ధ్యానింతు ♦ నాగశయన॥వివిధ॥౧౩

సీ॥ నీనామధ్యానంబు ♦ నియతి మాకమృతంబు
సాలోక్యపదవికి ♦ సాధనంబు
నీపైన మాభక్తి ♦ నిజము మాకదిముక్తి
నిఖిలంబునకు శక్తి ♦ నిగమవంద్య
నీ పాదతీర్థంబు ♦ మాపాపహరణంబు
బాపు నాకలుషంబు ♦ భద్రిగమన
నిరతంబు నీరూపు ♦ స్థిరతరంబుగ జూపు
పరతంత్రముల బాపు ♦ భక్తరక్ష
గీ॥ కంబుకంధర నీకుశర ♦ ణంబు జేతు
సంభ్రమంబున ననుబ్రోవ♦సమయమిదియె॥వివిధ॥౧౮

సీ॥ నీసొంపు నీపెంపు ♦ నీయింపు నీతెంపు
నీలంపు నీచాయ ♦ నెన్నడెరుగ
నీశాంతి నీదాంతి ♦ నీకాంతి నీక్షాంతి
నీ మంతనంబు నే ♦ నెన్నడెరుగ
నీతళ్కు నీబెళ్కు ♦ నీకుల్కు నీజిల్కు
నీ పల్కులందమే ♦ నెన్నడెరుగ
నీధైర్య నీశౌర్య ♦ నీవార్యచాతుర్య
నీచర్యలేమి నే ♦ నెన్నడెరుగ
గీ॥ వన్నెగుల్కెడు నీరూప ♦ మెన్నడెరుగ
గాన యిప్పుడైనజూపు మో ♦ కమలనాథ ॥వివిధ॥౧౯

సీ॥ నిత్యమై సత్యమై ♦ నియతిప్రకాశమై
నిర్గుణానందమై ♦ నెగడువాని
శుద్ధమై బుద్ధమై ♦ సురుచిరానందమై
సుందరాకారమై ♦ సొబగువాని
భోగమై రాగమై ♦ భోగిరాట్శయనమై
భక్తాగ్రగణ్యమై ♦ బరగువాని
నాదమై మోదమై ♦ నవ్యప్రధానమై
నాకారశూన్యమై ♦ యలరువాని

గీ॥ అట్టిజ్యోతిస్స్వరూపుండు ♦ అఖిలదీప్తుఁ
డైననిను నెంతు స్మరియింతు♦నమితముగను॥వివిధ॥౧౬

సీ॥ నేత్రోత్సవంబును ♦ నెరయ నీరూపంబు
నెమ్మిఁజూపగ వేగ ♦ లెమ్మురమ్ము
అత్యద్భుతంబుగా ♦ సలరారు నీకథల్
వీనులకింపుగా ♦ వింపునింపు
విమలచారిత్ర నీ ♦ వినుతిమాధుర్యంబు
నొనర నాజిహ్వయం ♦ దుంచు ముంచు
నీమహామహిమంబు ♦ నియతితో నామది
గోరి యానందంబు ♦ గొల్పసల్పు

గీ॥ వర్ణనీయము నీప్రభా ♦ వంబు గరిమ
దెలిపి నన్నేలు మోమహా ♦ దేవదేవ ॥వివిధ॥ ౧౭

సీ॥ త్రిజగవందిత నిన్ను ♦ నిజముగా ధ్యానింతు
యింనువిల్తుని తండ్రి ♦ యిందురార
రార సర్వబోధ్రివర ♦ రఘుకులాంబుధి చంద్ర
చంద్రికీర్తి ప్రభా ♦ సాంద్ర నీవు
నీవుగా లోకముల్ ♦ నిజముగా శ్రీవర
వరహాదిరూప యీా ♦ వసుధభూప
భూపాల పూజింతు ♦ నీపాదపద్మంబు
అంబుజోదర శర ♦ ణంబునీకు

గీ॥ నీకు మ్రొక్కితి యిటురార ♦ నిగమవినుత
వినుతపోషకుడీవె యో ♦ విహగవాహ ॥కవి॥ ౧౭

సీ॥ ఆశయనియెడి మేఘ ♦ మావరించియుగాగ
మోహాఖ్యవర్షంబు ♦ మోది కురున
దుఃఖములనియెడి ♦ దొడ్డ ప్రవాహముల్
కర్మంబురీతిగా ♦ కడకు బార
సంసారమను గొప్ప ♦ జలరాశి ననుముంప
హింసలుబడితి నో ♦ యినకులేశ
సంశయంబుడిపి నీ ♦ సఖునిగా నను జేసి
సరగున నేలుమో ♦ సాధుహృదయ

గీ॥ తెలిసె నీకీర్తియిప్పుడె ♦ స్తోటపడగ
వినుత నీపాదభజనంబు ♦ విడువనింక ॥వివిధ॥ ౧౮

సీ॥ భక్తుఁడై సీతతోన ♦ బనులు జేయింపను
మున్న భద్రాద్రి గో ♦ పన్న గాను
అశ్వంబుయని గోడ ♦ నదలించి కదలింప
ధీరుఁడై నట్టి క ♦ బీరుగాను
ఏకాదశీవ్రతం ♦ బెలమి మెప్పింపను
రామ నే రుక్మాంగ ♦ రాజుగాను
హరికథకీర్తిగా ♦ హరినిన్ను బొగడంగ
దాస తులసీరామ ♦ దాసు గాను
గీ॥ హీనుఁడను దీనుఁడనుసుమ్మి ♦ యిహములోన
నిన్నుస్మరియింతు నన్నేలు ♦ నిజవిచార ॥ఏవిధ॥ ౨౦

సీ॥ నిఖిలమూఢాచార ♦ నిబిడాంధ కారమ్ము
గ్రమ్మి నల్దిక్కుల ♦ గుమ్మరింప
కోర్కెమై సంసార ♦ ఘోరవారధి నాదు
చుట్టును నొకరీతి ♦ ముట్టడింప
దుఃఖాగ్ని జ్వాలలు ♦ ధుమధుమయని వేగ
మిన్నయై యేవేళ ♦ మినుకరింప
క్రూరపాపమ్ముగాలి ♦ గొబ్బున నసుబట్టి
చీల్చి చెండాడను ♦ చెనకరింప
గీ॥ నహహ యేరీతిభరియింతు ♦ నయ్యా నన్ను
గాచి రక్షింప నీవెహా ♦ కమలనాభ ॥వి॥ ౨౧

సీ॥ నీటిలోఁ గలయట్టి ♦ నీచ మీనంబువై
బుట్టి సోమకు జంపి ♦ నట్టి రామ
కూర్మావతారుడై ♦ కుధరుగా వీపున
అద్రి మోసినయట్టి ♦ యనఘ రామ
కర మొప్ప నీవుసూ ♦ కరరూపివై హిర
ణ్యాక్షునిదుంచిన ♦ దక్ష రామ
నరమృగాకారుడై ♦ నమ్మినదాసుని
ప్రహ్లాదు గాచిన ♦ ప్రౌఢ రామ

గీ॥ కరినిరక్షించితివి నీదు ♦ కరుణ రామ
రామనను గావు శ్రీరామ ♦ రామరామ ॥విశేష॥ ౨౨

సీ॥ శ్రీరామచంద్రుడా ♦ శ్రితపోషకుండంటి
కరిరాజరక్షక ♦ కావుమంటి
భవవిదూరుండని ♦ భావించి నేనంటి
భోగీంద్రశయన నన్ ♦ బ్రోవుమంటి
దైత్యసంహారనా ♦ దైవంబు నీవంటి
దాశరథే దయ ♦ దలపమంటి
విహగవాహన నిన్ను ♦ వినుతిజేసెదనంటి
పలుమారు నన్నుగా ♦ పాడుమంటి

గీ॥ ఆ ప్తరక్షకుడంటి నాపర ♦ మాప్తుడంటి
వెదకుచు నెయుంటి నాపాలి ♦ వేల్పువంటి ॥విశేష॥ ౨౩

సీ॥ శ్రీహరి సీతామ ♦ సేవానలజ్వాల
గాలదే నాకర్మ ♦ కాననంబు
నీదర్శనంబను ♦ నిఖిలవాయువుచేత
బారవే దుఃఖాభ్రి ♦ బాపసమితి
నీదు ధ్యానంబను ♦ నిజవజ్రిశరముచే
కుటిలగుణాద్రులు ♦ గూలలేవె
గోవిందస్మరణమనే ♦ గొప్పదీప్తినిబోవె
కలుషషడ్వర్గాంధ ♦ కారతతులు

తే॥ పరమపదవాస నీభక్తి ♦ పడవగాక
మేటిసంసారమంబుధి ♦ దాటనౌన ॥వివిధ॥ ౨౮

సీ॥ శ్రీరామ రఘురామ ♦ శ్రీనాథయందునో
భక్త రక్షాయని ♦ బల్కవలెనో
ఇనవంశతిలక ♦ నిటులరమ్మందునో
భోగీంద్రశయనా ♦ బొగడవలెనో
దైత్యవిధ్వంస మా ♦ ధవుడంచు దలతునో
పీతాంబరాయంచు ♦ బిల్వవలెనో
కమలారి ధామిత్రి ♦ కారుణ్యుడందునో
భద్రేభగామినా ♦ బాడవలెనో

తే॥ యెటుల ధ్యానింపవలయునో ♦ యిందిరేశ
పటుతరంబుగ దెల్పవే ♦ పద్మనాభ ॥వివిధ॥ ౨౯

సీ॥ వాల్మీకి మునియను ♦ వరమందరాద్రిచే
రామాయణంబను ♦ రమ్యవార్ధి
దరువంగ లక్ష్మియై ♦ దగసీత జనియింప
సౌమిత్రిచంద్రుఁడై ♦ సొంపుగుల్క
కల్పవృక్షము హరి ♦ కామధేనువులుగా
సుగ్రీవు డంగద ♦ సుముఖులలర
హనుమంతు మణి హార ♦ హాలము రావణుడన
సుధవిభీషణుడయ్యు ♦ సొబగు జెంద

గీ॥ ఇట్టి సచ్చిత్రమహిమాబ్ధి ♦ నెన్ను నరుల
కనుల నానంద బాష్పముల్ ♦ గ్రమ్ముగురియు ॥వివిధ॥

సీ॥ భృంగంబులకు మంచి ♦ బువ్వలందినయట్లు
కడుతామరలు హంస ♦ కందినట్లు
పేదవానికి నిధుల్ ♦ పెక్కుదొరకినయట్లు
కామధేనువు బీద ♦ కబ్బినట్లు
ఆకొన్న మనుజున ♦ కన్న మందినయట్లు
కరిపార్థనకు హరి ♦ దొరకినట్లు
పాపి యజామిళు ♦ ఫలము నొందినయట్లు
నిండు తపసికి మనసు ♦ నిల్చినట్లు

గీ॥ కన్నెయగు నన్ను నొక్కని ♦ కడకునట్లు
పాలనము సేయుదీనుల ♦ పాలిదేవ ॥వివిధ॥ ౨౭

సీ॥ నీలనీలపుఛాయ ♦ నీలోత్పలశ్యామ
నిగిగుల్కు రవికాంతి ♦ నెగడురామ
అందంద సుందర ♦ అబ్జజనుతరామ
అనుపమతులసీ ద ♦ ళాభిరామ
కనకమణిభూష ♦ కాంచనాంబరరామ
కార్ముకధర రత్న ♦ కవచరామ
ఇందిరావతి భక్త ♦ వందితసుత్రామ
నందనందన గోప ♦ కాంతరాము

గీ॥ పల్కుపల్కుకు సుధతేట ♦ లొల్కురామ
జిల్కుచును భక్తులలో ముద్దు ♦ గుల్కురామ ॥వివిధ॥

సీ॥ నిద్దంపుటద్దపుచెక్కు ♦ టద్దంబులనుగల్గి
ముద్దుల గుల్కెడు ♦ మోమువాడ
ఇందిరకును గేళి ♦ మందిరంబన బొల్చు
సందీప్త వక్షఃప్రి ♦ సన్న విభుడ
మణిమయుకాంతుండ ♦ మహనీయజఠరుడ
మకరకుండల రత్న ♦ మకుటధరుడ
కంకణకేయూర ♦ కమనీయబాహుండ
కర చక్రశంఖ శ్రీ ♦ కరవరుండ

గీ॥ యోగమాయావిదూరుండ ♦ యోగవిదుడ
భోగి భోగేంద్రశయన సద్భూరియశుడ ॥వివిధ॥ ౨౯

సీ॥ మది నిన్ను నేవేళ ♦ మరువక ధ్యానించు
నోరు మీపాటలే ♦ నుడువుచుండు
నీకీర్తి కర్ణముల్ ♦ నింపుగా వినుచుండు
కన్నులు నిరూపు ♦ గనుచునుండు
శిర మెప్పుడును నీకు ♦ శరణు జేయుచునుండు
చేతులు నీపూజ ♦ జేయుచుండు
ఆత్మ నీలోననే ♦ ఐక్యమైయుండును
కాయంబు నీసేవ ♦ గరపుచుండు

గీ॥ నిమరజెందిన యప్పుడైన ♦ నిజముగాను
చిత్తమొకరీతి మిమ్మునే ♦ జేరియుండు ॥విపిధ॥ 30

సీ॥ భీకరదాష్ట్రముల్ ♦ బిరుసు నఖంబుల
నరసింహ రూపుడై ♦ యలరినపుడు
భూరిజవంబున ♦ భూమినిరక్షించ
వరహావతారుడై ♦ వచ్చినపుడు
దుర్యోధనానుజ ♦ దుష్టవాక్యంబుల
కోపించి నిజరూపు ♦ జూపినపుడు
బరువడి భూమిని బలిని దానము వేడి
మించుగా నీమేను ♦ బెంచినపుడు

గీ॥ చూచి పూజించునట్టి యా ♦ సూరిజనులు
నెంతగా పుణ్యమొందిరి ♦ నెపుకగల్గి ॥విపిధ॥ 31

సీ॥ నీకరుణావృష్టి ♦ నింపి బ్రహ్మాండంబు
కనురీతి నేలునీ ♦ కరుణ కరుణ
గమఠాకృతియు దాల్చి ♦ ఘనవగం బెత్తిన
భవ్యచారిత్రి నీ ♦ బలము బలము
బాలుడౌ ధృవుని సం ♦ భావించి వే కృత
కృత్యుజేసిన నీదు ♦ కీర్తి కీర్తి
లోకరక్షణకళా ♦ లోలుడై భక్తుల
గాచుచున్నట్టి నీ ♦ ఘనము ఘనము
గీ॥ మాయజగమెల్ల బ్రోచు నీ ♦ మహిమ మహిమ
దాసుడైతిని నాకు నీ ♦ దాపుదాపు ॥వివిధ॥ 32

సీ॥ తామరతూండ్లను ♦ తరచుగా దినుహంస
లంటునే గోర్చిట్టు ♦ లమితమున్న
మధుపంబు గ్రోలెడి ♦ మధుపాళి తంగేడి
పూలజేరునె యంత ♦ బొలచియున్న
ఫలరసాన్నంబులు ♦ పలురీతిదిను నరుల్
భక్షింతురే యందు ♦ బచ్చిపూరి
శుద్ధోదకము ద్రావు ♦ సొంపైన బకపక్షి
కుడుచునే నిండ్లలో ♦ గుడితిసీరు.
గీ॥ భక్తితో మిమ్ము ప్రార్థింతు ♦ భాగవతులు
యొరుల ప్రార్థింతురే యెంత ♦ వారినైన ॥వివిధ॥ 33

సీ॥ ఆదినారాయణా ♦ అఖిలేశ్వరా తొల్లి
మునులెల్ల ప్రార్థింప ♦ ముదముతోడ
నుర్వీజనులకెల్ల ♦ నుపకార మొనరింప
దశరథు పుత్రుడై ♦ ధరను బుట్టి
పేరు రాముండని ♦ పెంపొంది నుతికెక్కి
ఆశ్రితజనావళి ♦ నాదరించి
ఘోరతాటకి నిల ♦ గూలంగ వైచియు
తపసి యాగముగాచి ♦ తపియరాతి

గీ॥ నాతిగను జేసి హరువిల్లు ♦ నంటి విరచి
సీతనటు బెండ్లియాడిన ♦ సిద్ధ చరిత. ॥వివిధ॥ 38

సీ॥ దశరథు పంపున ♦ దండకాటవి జనుల్
జూడ సీతా దేవి ♦ తోడరాగ
ముని వేషమునబోయి ♦ ముందుగ గుహునితో
గమియించి చిత్రకూ ♦ టమున కరగి
రక్కశి చెవులును ♦ ముక్కును గోయించి
మొండిఖరాదుల ♦ చెండివైచి
మాయామృగము నొక్క ♦ మాటున దునుమాడి
సీతను గోల్పోయి ♦ చింతతోడ

గీ॥ నెఱియ ముక్తి జటాయువు ♦ నెగడజేసి
శబరి వినుపింప కిష్కింధ ♦ జేరినట్టి ॥వివిధ॥ 39

సీ॥ వాలిని వధియించి ♦ వాయుజు సుతుచేత
ముద్రిక నంపియు ♦ ముదముతోడ
సీతవార్త నెఱింగి ♦ శీఘ్రమె కపులచే
వారిధి గట్టించి ♦ వరుసలంక
జేరి విభీషణు ♦ చేపట్టి రక్షించి
కుంభకర్ణాదుల ♦ గూలనేసి
రాక్షసావళి నెల్ల ♦ రయమున దునుమాడి
ఘోరరావణు తలల్ ♦ గొట్టివైచి
గీ॥ భూసుతను గాంచు సాకేత ♦ పురముజేరి
భక్తులనుబ్రోచి పట్టాభి ♦ షిక్తుడైన ॥వివిధ॥ 31

సీ॥ ధగధగ మణికాంతి ♦ దళుకొత్తు ముఖమును
నిగనిగ కనుల శో ♦ యగము వాడ
నుతభక్తపోష స ♦ న్నుతవర దరహాస
హితసుజనాళి సు ♦ వ్రత ప్రకాశ
ధరవర కార్ముక ♦ ధరభూమి సురపోష
దినకర కోటి సం ♦ దీప్తతేజ
భాగ్య భోగాద్భుతం ♦ బలరు శ్రీహరివిష్ణు
లాలిత సద్గుణా ♦ లంకరిష్ణు
గీ॥ మహిత లావణ్య మహాసీయ ♦ మంజుభాషి
చిరశుభాకార ఋందిరా ♦ చిత్తచోర ॥వివిధ॥ 32

సీ॥ తాండవనాట్యుఁడై ♦ పాంచు పత్రంబున
ఫల్గును రథముపై ♦ బరగువాని
గొల్లలిండ్లకు బోయి ♦ గొబ్బున వెన్నయు
దొంగలించిన యట్టి ♦ దొడ్డవాని
గోపాలురను గూడి ♦ యేపారయడవిలో
గోవులుగాచిన ♦ గొల్లవాని
ఘనముగా కాలాహి ♦ గర్వంబు నణచిన
ఘన యశోనిధి నీల ♦ కాంతివాని

గీ॥ దాసదాసుల గాపాడ ♦ దలచువాని
మహిని రక్షించువాని నా ♦ మదిని దలతు ॥వివిధ॥౩౦

సీ॥ చెలువుఁడై నీ మీద ♦ చిత్తంబు నిల్పియు
దండమనగ విదు ♦ రుండగాను
మెచ్చి నీ ధ్యానంబు ♦ మేలంచు బొగడను
కడుభక్తుఁడౌ కుచే ♦ లుడనుగాను
అత్రి త్రియును నిన్ను ♦ ఆర్తరక్షాయని
కంఠోక్తి బిల్వ యా ♦ కరిని గాను
నీవు చెప్పిన పనుల్ ♦ నిఖిలంబు జేయను
చండమారుత తనూ ♦ జుండగాను

గీ॥ దుర్మదాంధుండ హీనుండ ♦ దుష్టమతిని
కఠినుడను సుమ్మి ననుబ్రోవు ♦ కరుణతోడ ॥వివిధ॥

సీ॥ అనాఁడు పాంచాలి ♦ యభయమిమ్మని వేడ
సభలోన కోకలొ ♦ సంగలేదె
శిలరూపు ధరియించి ♦ నిలమీద బడినయా
హల్యనెంతయు కృప ♦ నరయలేదె
ఘోరాస్త్ర బాధచే ♦ గుందిన యుత్తర
గర్భస్థు బాలకు ♦ గావలేదె
సురలెల్ల రావణ ♦ చూట్కికి భయమంది
మొరలిడ వానిని ♦ దరుగలేదె

గీ॥ అందరికి కోర్కెదీర్చిత ♦ నాధరక్ష
నేడునాకోర్కె దీర్పను ♦ నీకురాదే ॥వి॥ధ॥ ౪౦

సీ॥ సకలేంద్రియంబులు ♦ సవరించి నినుగూర్చి
పరగ పూజించుటె ♦ పర్వదినము
నిఖిలంబు వదలియు ♦ నిష్టతో నినుగోర
శ్రేష్టమౌ గోకుల ♦ అష్టమదియె!
మానసంబున నిన్ను ♦ మరిమరి ధ్యానింప
నమరంగ శ్రీరామ ♦ నవమి యదియె
విషయంబులను వీడి ♦ విమల విజ్ఞానిగా
సతత మేకాదశీ ♦ వ్రతమునదియె

గీ॥ అకట పండుగ పర్వంబు ♦ లనగనేల
నిన్ను గొల్చుటె సర్వంబు ♦ నిగమవేద్య ॥వివిధ॥ ౪౧

సీ॥ సురు లసురులు గూడి ♦ సుధకయ్యుదరువగ
మందరంబంబుధి ♦ యందు మునుగ
దేవదానవులెల్ల ♦ దేరి చూచుచునున్న
కూర్మంబవై నీవు ♦ కుధరమెత్త
నయముగా నందులో ♦ నమృతంబు బుట్టిన
నసురులు అదిగొని ♦ యరుగుచున్న
దేవగణంబది ♦ దెలిసి ప్రార్థించగ
దయతోడ స్త్రీరూపు ♦ దాల్చి నీవు

గీ॥ అసురవరులను వంచించి ♦ యమృతమపుడు
సురలకిచ్చిన దిట్టయో ♦ సుజనపోష ॥వివిధ॥ ౮౨

సీ॥ తల్లిదండ్రుల ప్రేమ ♦ వుల్లసిల్లుచునున్న
భార్యసతి ప్రేమతో ♦ బరగుచున్న
పుత్రుల పితృభక్తి ♦ ప్రభలు గొల్పుచునున్న
ఘనబంధువుల కాంక్ష ♦ గ్రమ్ముచున్న
అన్నదమ్ముల భ్రాంతు ♦ లావరింపుచునున్న
దేశభృత్యులు దన్ను ♦ దేవుడన్న
తన కంత్యకాలంబు ♦ దగవచ్చి జనుచున్న
వెంట నొక్కరురారు ♦ వేలకున్న

గీ॥ గాన మడి కోర్కెలన్నియు ♦ గాల్చివైచి
ముందె నినువేడు చుండిన ♦ మోక్షమబ్బు ॥వివిధ॥ ౮౩

సీ॥ నీ కాంతి యిదియని ♦ నీ రేజమిత్తుని
సుందరంబుగ మింట ♦ జూపినావు
నీశాంత మిదియని ♦ నింపు చందురులోని
చల్లని కళలెల్ల ♦ జాటినావు
నీ నిధానమునకు ♦ నీటు గా నందంద
ముదధులు సాక్షిగా ♦ నుంచినావు
నీలీల మహిమంబు ♦ లివియని మెరుగంగ
మెంచి యీజగతి సృ ♦ ష్టించినావు
గీ॥ అన్నిటను నీవె బ్రహ్మాండ ♦ మంతనిండి
యుండి నంటక సాక్షివై ♦ యొప్పినావు ॥వివిధ॥ ౨౨

సీ॥ శివచాప హరభూప ♦ భవతాపములు బాప
బలురూపములు జూప ♦ బరగువాని
వరశూరు సువిచారు ♦ గిరిధారుజయవీరు
ఘనమేరు సమధీరు ♦ దైనవాని
దశవేషు మణిభూషు ♦ ఖరపోషు మృదుభాషు
భవశోషు పరితోషు ♦ భద్రియశుని
సుకులందు నరులందు ♦ హరులందు గిరులందు
చరులందు తరులందు ♦ చెలగువాని
గీ॥ సగుణ నిర్గుణ రూపుడై ♦ నెగడువాని
దడయకెప్పుడు మదియందు ♦ దలతు గొలుతు॥వివిధ॥

సీ॥ దీనవత్సల గురా ♦ ధారసన్ముని స్తోత్ర
స్తోత్రింబు జేతు నే ♦ చిత్రముగను
గనుగొంటి నీదగు ♦ గాంభీర్యమగు శక్తి
శక్తిగల్గించి స ♦ న్ముక్తి యుమ్ము
యుమ్ముగా లోక ఘం ♦ జమ్ములఁ బాలింపు
యింపుతోడుత నీవ ♦ యిందురార
రార భాసుర ముఖ ♦ రవికోటి సంకాశ
ఆశదీర్చుము వేగ ♦ అమితధీశ

గీ॥ ధీశ వినుతింతు నీదైన ♦ ధీగుణంబు
అంబుజోదర నీదు పా ♦ దంబుదలతు ॥వివిధ॥ ౮౬

సీ॥ జంభారినుత నీదు ♦ గంభీర కీర్తులు
డంబుగానిండె లో ♦ కంబులెల్ల
శుభ్రమై ఘనశార ♦ దాభ్రమా నీకళల్
విభ్రాజ మానమై ♦ విల్లసిల్లె
అంబు సంభృతత్వత్ప ♦ దాంభోరుహాధ్యాన
కుంభినీ సుజన మో ♦ క్షంబు నయ్యె
విభ్రమా వహాములై ♦ వెలసె నీమహిమంబు
లభ్రింక షంబులై ♦ ఆవరిల్లె

గీ॥ దివ్యమంగళ విగ్రహ ♦ దేహుడైన
నిన్ను బొగడంగ దరమె యో ♦ నీలవర్ణ ॥వివిధ॥ ౮౭

సీ॥ అతినియతి పరులైన ♦ ఆచార్యులునుగాని
వ్రతము నిష్టతో జేయు ♦ వారుగాని
బలువిద్య నేర్చిన ♦ బ్రాహ్మణులనుగాని
భువినేలినట్టి భూ ♦ భుజులుగాని
లింగమర్చనజేయు ♦ జంగమయ్యలుగాని
నిండువ్యాపారి వై ♦ శ్యుండుగాని
కమ సేద్య మొనరించు ♦ కమ్మ కాపులుగాని
వరున సంకరజాతి ♦ వారుగాని

గీ॥ యెట్టివారైన మదిలోన ♦ దిట్టముగను
మిమ్ము ధ్యానింప గల్గు మో ♦ క్షమ్ము దేవ ॥వివిధ॥

సీ॥ కమరీతి మోహాసం ♦ కలితమై నాబుద్ధి
దేవ నీచింతన ♦ దెరల నీదు
దధిఘృతంబుల రుచుల్ ♦ దనసి చొక్కుచు జిహ్వ
బాయక మీస్మ్రితి ♦ జేయ లేదు
నారీమణుల సొగ ♦ సరయు నాదగుచూపు
నీదు పాదముపైన ♦ నిలువరాదు
దుష్ట వాక్యంబులు ♦ సిష్టగా వినగోరు
కర్ణముల్ నీదగు ♦ కథలు వినవు

గీ॥ తనువు నెరపదు వైరాగ్య ♦ ధర్మములను
గాన యేరీతినైన నం ♦ గావుమయ్యా ॥వివిధ॥ ౪౯

సీ॥ జగతి నశ్వరమంచు ♦ జాటించి చెప్పిన
వినదాయె నాబుద్ధి ♦ వేదవేద్య
సుఖదుఖములు సాక్షి ♦ జూపి బోధించిన
చెవియొక్క దింతైన ♦ చపల మిడదు
దేహమ స్థిర మని ♦ దెల్వంగ బలికిన
యాలింప కెచటికో ♦ యరుగుచుండు
జ్ఞానమార్గము జూపి ♦ గట్టి వేసెదనన్న
దెంపుతో పర్విడు ♦ దెలియకుండ
గీ॥ ఇట్టి నాబుద్ధి నీవైన ♦ గట్టిపరచి
నీదు ధ్యానంబులో నిల్పు ♦ నీరజాక్ష ॥వివిధ॥ ౫౦

సీ॥ తిన్నగా మీకథ ♦ విన్నను జాలదా
భూషణాల్ చెవులకు ♦ బెట్టనేల
పూలతోడను మిమ్ము ♦ పూజింపజాలదా
మంచి కాపులు చేతి ♦ కుంచనేల
బాయక నీభజన ♦ జేయంగ చాలదా
జలుకొత్తు హారముల్ ♦ దాల్చనేల
తలవంచి దండంబు ♦ సలుపంగచాలదా
వేరే కిరీటంబు ♦ వుదుకనేల
గీ॥ నీవెసర్వంబు మాకును ♦ నిశ్చయముగ
దేవ జగదీశ యో మహా ♦ దేవదేవ ॥వివిధ॥ ౫౧

సీ॥ సత్యమే మాతగా ♦ సతతమెంచెడువాడు
జ్ఞానంబు తండ్రిగా ♦ గనెడువాడు
ధర్మంబె భ్రాతగా ♦ దగనెంచెడువాడు
దయయె చెల్లెలటంచు ♦ దలచువాడు
శాంతమే పత్నిగా ♦ సంతసించెడువాడు
క్షమయె కొమరుండని ♦ భ్రమయువాడు
భక్తియే తనకెల్ల ♦ బంధువులనువాడు
ముక్తిని గోరుచు ♦ మురియువాడు

గీ॥ దేవ త్రైలోక్య పూజ్యుడై ♦ దేజరిల్లి
ఘనము మీరంగ వైకుంఠ ♦ మునకు జేరు ॥వివిధ॥ ౫౨

సీ॥ ఖగవాహన ముకుంద ♦ శార్ఙ్గ వరబృంద
గంగాధర స్తుత్య ♦ ఘనకిరీట
మణిమయాలంకార ♦ మౌక్తిక మయహార
కవచ కుండల శీల ♦ కాంతివదన
గోవర్ధనోద్ధార ♦ గోపీమనోహర
గానలోల విపక్ష ♦ కంసహరణ
అంభోజ దళనేత్ర ♦ అమర సంస్తుతపాత్ర
దైత్య సంహార చక్ర ♦ ధరవిలాస

గీ॥ కోటి రవితేజ భావనేక ♦ కోమలాంగ
భక్తరక్షణ పరతంత్ర ♦ భవవిదూర ॥వివిధ॥ ౫౩

సీ॥ వలనొప్ప నీవును ♦ వటు వేషధారివై
దొడ్డ బలిచక్రిని ♦ ద్రొక్కినావు
యిష్టముల్ దీర్ప శ్రీ ♦ కృష్ణుడై జన్మించి
దుష్టకంసుని తల ♦ దునిమినావు
రయము మెప్పగను వేగ ♦ రామావతారుడై
మించు రాక్షసుల మ ♦ ర్దించినావు
వడి తుడిగను వేగ ♦ వరహావతారుడై
మేటి హిరణ్యాక్షు ♦ గీటినావు
గీ॥ ఇట్టి వేషాలతోడ నీ ♦ యిహముపరము
సుఖము నొందింపు చుందువో ♦ సుందరాంగ ॥వివిధ॥

సీ॥ శ్రీమనోహరనిన్ను ♦ సేవించినందుకు
నామది హర్షణంబు ♦ నంద జేతు
మభయ ప్రదాత నీ ♦ విభవంబు ప్రోపించి
శుభము లొసంగు మో ♦ సుందరాంగ
అఖిలాత్మ నీవైన ♦ యా-కార భావంబు
దర్శనం బిమ్ము ఓ ♦ ధన్యచరిత
సుమనః పదంబును ♦ జూపను నాపైన
భ్రమదలిర్పుము వేగ ♦ భద్రరక్ష
గీ॥ విమల సదసత్ ప్రకాశ యో ♦ విశ్వభావ
సగుణ నిర్గుణరూప యో ♦ సత్యదీప ॥వివిధ॥ ౫౫

సీ॥ కసవు మెసవు గోవు ♦ లక్షమానము గలోక
వసతికై క్షీరంబు ♦ కొసరకిచ్చు
మధురాంబువులు బీల్చు ♦ మరిభూరుహంబులు
పరిపక్వమైనట్టి ♦ ఫలములిచ్చు
తరణికిరణమ్ముల ♦ దగనోర్చియును లతల్
వివిధ రుజలకో ♦ మధుల నిచ్చు.
ఫలరసమ్ములు గ్రోలి ♦ పక్షులెవ్వేళల
మాధుర్యగాన వి ♦ నోదమిచ్చు

గీ॥ నిబిడ వైచిత్రిమైనట్టి ♦ నీదు సృష్టి
నెన్న నాచేత నగునె యో ♦ కన్నతండ్రి ॥వివిధ॥ ౫౬

సీ॥ ఆశచే జిక్కి నే ♦ నలవరించితినయ్య
మోహంబుచేత ని ♦ ర్మోహిగాక
వాంఛ వస్తువులందు ♦ వసియించె నయ్యనా
కామంబుచేత ని ♦ ష్కామిగాక
ప్రేమంబు ప్రజలపై ♦ పెరుగుచుండె గదయ్య
నిజముగా నీనామ ♦ భజనలేక
కాంక్షించి ధనమునే ♦ కలువరించె గదయ్య
భద్రేభగమన నీ ♦ భక్తిలేక

గీ॥ జలరుహ దళాక్ష నీకునే ♦ శరణుజేతు
భక్తవరముకుంద నను గావు ♦ భవవిదూర ॥వివిధ॥ ౫౭

సీ॥ నీమహా మహిమచే ♦ నిఖిల బ్రహ్మాండంబు
గల్పించి యేలిన ♦ ఘనుఁడటంచు
నీ యశోమృతమును ♦ నింపి లోకములెల్ల
పాలన జేసిన ♦ ప్రభుడవనుచు
నీ భక్తవరులను ♦ నిజముగా జగతిని
రక్షించి నట్టి బల్ ♦ రసికుడంచు
నిన్ను నామనమున ♦ నిశ్చయంబుగ వేద
ఖ్యాతిగా నన్నిప్డు ♦ బ్రోతువంచు
గీ॥ గొల్చి వేడితి నీకరుణ ♦ గొమరు మిగుల
నిచ్చి ననుగావుమయ్య యో ♦ నిర్మలాత్మ ॥విసిధ॥ ౫౮

సీ॥ దివ్య స్థలములన్ని ♦ దిరిగిచూడగ నౌను
చెలగి దానంబులు ♦ చేయనౌను
సత్రియాగము లెల్ల ♦ చాలసల్పగనౌను
నోటితో మీభజన ♦ నుడువనౌను
సకల వేదంబుల ♦ సారంబు గననౌను
పదమున కథనంబు ♦ బడయనౌను
కోపతాపములెల్ల ♦ గోసివేయగనౌను
యింద్రియాదుల జ ♦ యింపనౌను
గీ॥ బుద్ధి యొకరీతిగా మిమ్ము ♦ బొందజేసి
నిన్నుగాంచుటగాదు ఓ ♦ నీలవర్ణ ॥పవిధ॥ ౫౯

సీ॥ పొందుగా సుతదార ♦ పోషణార్థంబుకై
తలపాగలను మార్చి ♦ తడయకేను
ఋణబాధలకు జిక్కి ♦ ఘనవేదలకు స్రుక్కి
వెతలపాలైతినో ♦ వెర్రినయ్యి
తీర్చను దరిలేక ♦ తిండికింటనులేక
చిత్త విభ్రమణంబు ♦ చెందియుండి
అనృతంబు లాడుచు ♦ అన్యాయమును బూని
అలసట బడితినో ♦ యయ్యనేను

గీ॥ హరిహరీ యిట్టిజన్మంబు ♦ లవనియందు
వలదు కడతేర్చుమయ్యా యో ♦ వనజనాభ ॥విविధ॥

సీ॥ దినదినము దాసులు ♦ దివ్యపదార్థముల్
దెచ్చి యిత్తురుగదా ♦ దేవనీకు
కలగూర వంటకం ♦ కడు చక్కెరుక్కెరల్
పచ్చళ్ళు వడపప్పు ♦ పాయసములు
అతిరసమ్ములు వర్గు ♦ లప్పము లప్పళాల్
గారెలు బూరెలు ♦ చారుమోరు
దధిఘృతంబును తేనె ♦ నధికక్షీరము లిడ్డె
నలు మొదలుగా నిడ ♦ నధిప వేగ

గీ॥ భూసుతయు నీవు సంతృప్తి ♦ బొందుచుండు
తారక బ్రహ్మనామ కో ♦ దండరామ ॥విविధ॥ ౬౧

సీ॥ మునుల గాపాడి నా ♦ వనుటకు ముందుగా
చెంగి తాటకియొక్క ♦ చావెసాక్షి
పతిత పావనుఁడౌట ♦ పరగహల్యాదోష
పంక్తి బాపిన నీదు ♦ పదమెసాక్షి
శౌర్యస్యౌదార్య గాం ♦ భీర్యబాహుడ పొట
విరిగిపోయిన హరు ♦ విల్లెసాక్షి
దాసరక్షక మోక్ష ♦ దాతనీవౌటకు
నిండుబీదగు కుచే ♦ లుండెసాక్షి

గీ॥ కడకు మోక్షంబు నొసగ నీ ♦ కరుణెసాక్షి
దక్షయ నన్నేలుటకు నీదు ♦ దయయెసాక్షి ॥వివిధ॥

సీ॥ దివ్యమై సుజన సం ♦ భావ్యమై ఋషులకు
సేవ్యమై జ్ఞానంపు ♦ కావ్యమగుచు
కిరణమై భక్తాఘ ♦ హరణమై నతి యలం
కరణమై ముక్తికా ♦ భరణమగుచు
అందమై సురచిరా ♦ నందమై వరయోగి
బృందమై శృతిపద్మ ♦ కందమగుచు
చిత్రమై భువిజన ♦ స్తోత్రమై పరలోక
పత్రమై దాసుల ♦ పాత్రమగుచు

గీ॥ బరగు నీనామ మాధుర్య ♦ ఫలరసంబు
తనివిదీరంగ నిమ్ము నీ ♦ తనయుడనుచు ॥వివిధ॥ ౬౩

సీ॥ పంచ భూతాత్మకం ♦ బగు ప్రపంచంబెల్ల
ఇంచుక నీవు సృ ♦ జించ లేద
నాభీకమలమందు ♦ నయ మొప్ప బ్రహ్మను
బుట్టించి సంతసం ♦ బొంద లేద
నీ తలంపైన యా ♦ భూతలంబందలి
జీవరాసుల నెల్ల ♦ బ్రోవ లేద
సనక సనందన ♦ సన్మునీంద్రుల కెల్ల
చయ్యన మోక్షంబు ♦ నియ్య లేద

గీ॥ పతిత పావననే నొక్క ♦ పామరుడను
సుతునిగా నెంచి నన్నేలు ♦ సుజనపోష ॥వివిధ॥ ౬౮

సీ॥ మృదుల శయ్యాతల్ప ♦ ములు లేకపోయెనో
శేషపర్యంకంబు ♦ జేరినావు
నవరత్న ఖచితమౌ ♦ నగరు లేకుండెనో
నిండు జలరాశిలో ♦ నిలచినావు
రథగజతురగముల్ ♦ రమణీయముగ లేవో
నెగసిపొయ్యెడి పక్షి ♦ నెక్కినావు
మల్లెమొల్లలు జాజి ♦ మర్వంబు లేకనో
మించుగా తొలసి ధ ♦ రించినావు

గీ॥ అకట నీచిత్ర మహిమంబు ♦ లవనియందు
వర్ణనీయంబులై తోచె ♦ వసుమతీశ ॥వివిధ॥ ౬౯

సీ॥ దూషించి తన్ను పుత్రు ♦ దూలనాడెడు తల్లి
విధవరాలై యింటిలో ♦ వెలయుబిడ్డ
పరవరకాంక్షతో ♦ బరగుచుండెడిభార్య
అనయంబు పీడించు ♦ నట్టివేశ్య
తెంపుతో గట్టింప ♦ దీరకుండిన ఋణము
ఈపంచ దుఃఖాగ్ను ♦ లిమిడియున్న
నరుని దేహము కగ్ని ♦ నక్కరలేకయే
కాలి భస్మంబు తా ♦ గాక యున్నె

గీ॥ హరిహరీ యిట్టి దుష్ప్రాప్తి ♦ అవనియందు
వలదు యెంతటివారికి ♦ వనజనాభ ॥విధి॥ ౬౬

సీ॥ ధృవునికి సీపైన ♦ దృఢభక్తిలేకున్న
పొల్చి నక్షత్రమై ♦ నిల్చువాడె
రుక్మాంగదుడు నిన్ను ♦ రూఢిగొల్వకయున్న
దాతయై పేరొంది ♦ దనరువాడె
అక్రూరుడు శుభాంగు ♦ నర్చింపకయున్న
కడుసాధువని కీర్తి ♦ గాంచువాడె
శ్రీకబీరుడు నీదు ♦ సేవజేయకయున్న
చెలగి మోక్షార్హుడై ♦ చనెడువాడె

గీ॥ కడకు కరిరాజు మీకృప ♦ వడయకున్న
సందియము లేక పరసుఖ ♦ మొందువాడె ॥విధి॥ ౬౭

సీ॥ శ్రీరామనిన్ను నా ♦ చిత్తంబులో జేర్చి
బాగుగా గొల్చితి ♦ భక్తితోడ
రఘుకుల శేఖరా ♦ రాజోత్తమాయంచు
సాగిలి మ్రొక్కితి ♦ రాగమెసగ
లక్ష్మణాగ్రజుడంచు ♦ రాక్షస హరుడంచు
భజనలు జేసితి ♦ బ్రహ్మజనక
ఆధారమని నీదు ♦ పాదారవిందమ్ము
పూజలు చేసితి ♦ పొందుగాను

గీ॥ వేలుపుల దేవదాసుల ♦ వెరపుగావ
భావమిది మేలు ఇటురార ♦ భవవిదూర ॥వివిధ॥ ౨౮

సీ॥ మునుదధీచియు వేగ ♦ ఘనముగా తనవీపు
నెముక నొసంగడే ♦ ఇంద్రునకును
పరగంగ నప్పుడే ♦ పక్షినిరక్షింప
యాశిబి మాంసమ్ము ♦ గోసియీడె
కపురీల భూమి మూ ♦ డడుగులు వేడంగ
యియ్యడె బలిదైత్యు ♦ డింపుతోడ
ధరమయూర ధ్వజు ♦ దానంబు కోరకయ్యు
తనదేహ మర్ధంబు ♦ దరిగియీడె

గీ॥ ఇట్టి సంపూర్ణభక్తులు ♦ యింపుమీర
నుండగా నన్నుమరువకు ♦ నురగశయన ॥వివిధ॥ ౨౯

సీ॥ ఎందెందు జూచిన ♦ నందందు నందునీ
కరుణా పరిపూరంబె ♦ కారులుచుండు
నేచోట జూచిన ♦ నాచోటులందునీ
స్తోత్ర పాఠములే ♦ సొంపుగులుకు
నేదేశ మరసినా ♦ నాదేశమందునీ
ప్రఖ్యాతి దీప్తులే ♦ ప్రబలుచుండు
నేధామ మరసిన ♦ నాధామమందునీ
దండి తేజోజ్వాల ♦ దనరియుండు

గీ॥ అహహా అణుతృణరేణువు ♦ లందునెల్ల
నిండి నిబిడీకరితుండైన ♦ నిర్వికార ॥వివిధ॥ 20

సీ॥ వేమారు నిన్నునే ♦ వేడుచుండినగాని
కరుణగల్గదదేమి ♦ గమలనాభ
కరిరక్షకాయని ♦ కడు నార్తి బిలచిన
మాటలాడవదెంత ♦ మహిమవయ్య
మాటలాడిన నీదు ♦ నోటిముత్యములేమి
ఝల్లున రాలునా ♦ జలధిశయన
ధాతవంచును నీదు ♦ దరిజేరువారిని
బ్రోవకుండిన కీర్తి ♦ బొందుటెట్లు

గీ॥ ఎల్లదైవంబు నీవె నా ♦ యుల్లమలర
మొరిక్కుచుంటిను నీపాద ♦ ములకు నెపుడు ॥విధ

సీ॥ ధనువు భంజించు చో ♦ దగ వీరరసమును
అఘులాల బోవ ద ♦ యారసంబు
అంగన సీతకు ♦ శృంగార రసము వే
దాంతులౌ మునులకు ♦ శాంతిరసము
అరయ శూర్పణఖకు ♦ హాస్యరసంబును
పుణ్యుడౌ బలికి కా ♦ రుణ్యరసము
సేతు బంధనమందు ♦ ప్రీతి నద్భుతరసము
బలు రాక్షసులకు భీ ♦ భత్సరసము

గీ॥ క్షుద్రుడౌ రావణుని దున్మ ♦ రౌద్రరసము
జూపి యున్నట్టి నవరస ♦ సుందరాంగ ॥వివిధ॥ 22

సీ॥ సీచుని స్నేహంబు ♦ నెమ్మి జేసిన చెడ్డ
వార కాంతల పొందు ♦ వలన చెడ్డ
చెడిచుట్టముల చెంతి ♦ జేరబోయిన చెడ్డ
పరులదూషించెడి ♦ పనులు చెడ్డ
తెప్పు మాటలు బల్కి ♦ తగవులాడిన చెడ్డ
మెప్పుగలిగె నటంచు ♦ మెరయు చెడ్డ
యిచ్చెదనని చెప్పి ♦ యివ్వకుండిన చెడ్డ
నమ్మించి చెఱచిన ♦ నధిక చెడ్డ

గీ॥ భండనోద్దండ సీతాప ♦ భక్తిలేని
మనుజుడై పుట్టిగిట్టుట ♦ మరియు చెడ్డ ॥వివిధ॥ 23

సీ॥ అకటకటా కృత్తు ♦ నంటి పనుల్ బూన
వికట కార్యములెన్ని ♦ వేలాగలిగె
యమభటావళి బాధ ♦ కెంతైన దాళెదు
నిం ఋణబాధకే ♦ నిర్వహింప
లేచి లేవకమున్నె ♦ లేమిడిచే పాలు
మాలియు నాబుద్ధి ♦ కూలిపోయె
పూట గ్రాసంబుకై ♦ పొక్కుచు చింతల
యుందె నా దేహంబు ♦ గుందిపోయె

గీ॥ అయ్యయో నోర్వ యీకష్ట ♦ మవనియందు
నెయ్యమున వేగ నేలుమా ♦ యయ్యనీవు ॥వివిధ॥౨౮

సీ॥ భాసుర రత్న సిం ♦ హాసనాసీనుడై
కోటిసూర్య ప్రభల్ ♦ దీటుగుల్క
అంఘ్రిద్వయము బట్టి ♦ ఆంజనేయుండుండ
వామాంకమున సీత ♦ ప్రేమజూప
ధవళ ఛత్రంబును ♦ దగ చేత బూనియు
లక్ష్మణుం డొకవంక ♦ నమరియుండ
భరత శత్రుఘ్నులు ♦ పరిపరి నిరుగడల్
వింజామరంబులు ♦ వీచుచుండ

గీ॥ దేవ యీ వైభవం బెపుడు ♦ దేటగాను
దాసుడగు నాకు జూపుమో ♦ ధన్యచరిత ॥వివిధ॥౨౯

సీ॥ సంత తాశ్రితపోష ♦ సద్గుణ మణిభూష
సేవింతు దశవేష ♦ శ్రీరమేశ
గోపాల సర్వేశ ♦ గోవింద జగదీశ
సేవింతు దశవేష ♦ శ్రీరమేశ
సుందర దరహాస ♦ సుజనాళి వరయీశ
సేవింతు దశవేష ♦ శ్రీరమేశ
వసుధపాలన ధీశ ♦ వందిత భవనాశ
సేవింతు దశవేష ♦ శ్రీరమేశ

గీ॥ చెలగి నన్నేలు మింకను ♦ శ్రీరమేశ
చేరియిటురారదలతునిక ♦ శ్రీరమేశ ॥కవిధ॥ ౭౯

సీ॥ శ్రీవరనీదు ద ♦ శావతారంబులు
వర్ణనీయంబులు ♦ వరుసగాను
వినిదానుడగు వాడు ♦ విస్మయంబందుచు
పులకాంకురము మేను ♦ జిలుకబార
హరియు నారాయణ ♦ ఆనందదాయక
నందనందన ముచు ♦ కుందవరద
అనుచు పాడుచునాడు ♦ ననయంబు ధ్యానించు
హరుషాశ్రు నీరంబు ♦ లలుత బార

గీ॥ సిరముగా నెప్డుమదిలోన ♦ మరునకుండ
విమల మగునీదు భక్తికి ♦ వివశుండయ్యె ॥విక్రధ॥ ౭౦

సీ॥ బాలత్వమందున ♦ భ్రమసినే కొన్నాళ్ళు
ఆట పాటలనెల్ల ♦ నాడుచుంటి
యౌవనంబున క్రొవ్వు ♦ యధికమై దెలియక
పువ్వుబోణులతోడ ♦ బొందియుంటి
మితిమీరియును దార ♦ సుతభ్రాంతిచే గుంది
వెతలచే భువిలోన ♦ వెలయుచుంటి
వృద్ధాప్యమున ఆశ ♦ బద్ధానురాగుడై
బుద్ధిలేశము లేక ♦ బొరలుచుంటి
గీ॥ బడుగు ముసలెద్దు రోసిన ♦ పగిదినంత
గష్టమున నీదు స్మరణంబు ♦ గానకుంటి ॥వివిధ॥ ౭౫

సీ॥ లోకైక హితకార్య ♦ లోలుడయ్యనుచాల
భవతి భిక్షార్థుల ♦ భ్రమణదీర్చి
పూని సద్ధర్మముల్ ♦ పొందుగా నూహించి
శ్రద్ధచే నివియెల్ల ♦ సంఘటించి
హృదయాంబుజాతంబు ♦ బొదలకుండగనిల్పి
ప్రబలమౌ భక్తిని ♦ ప్రాభవించి
పరిపూర్ణ కాంక్షతో ♦ బరగనిర్భూజించి
నమితప్రేమంబుచే ♦ ననుదినంబు
గీ॥ దేవ నినుగొల్చి పొల్చెడు ♦ దేశికునకు
సందియంబేల పరసౌఖ్యం ♦ మందెయుండు ॥వివిధ॥ ౭౬

సీ॥ చాలునో ఈచలా ♦ చేలనో నేతాళ
జాలనో నందనో ♦ పాలబాల
పారములేని సం ♦ సారము సాకు బహు
కూ్రరము నీభక్తి ♦ దూరమాయె
పుత్రులు నాపాలి ♦ శత్రులు మావంశ
పౌత్రులు దుర్గుణ ♦ గాత్రులైరి
బంధువుల్ రక్త సం ♦ బంధులు నారణ
గ్రంధులై నేబాధ ♦ నొందగల్గె

గీ॥ ఇట్టి కష్టంబు ప్రాప్తించె ♦ యింతెగాని
వలదు మరుజన్మ మారినీకు ♦ వాసనంబు ॥వివిధ॥ ౮౦

సీ॥ రూపింప భోగికి ♦ ఉంవచ్చు ననుభయం
బలియుడై యున్న దు ♦ ర్బలభయంబు
మానవంతున కవ ♦ మాన భయంబును
దడయు కాముసకు వృ ♦ ద్ధత్వభయము
ధనము గణించిన ♦ దగ చోరభయమును
వలనొప్పు రాజుల ♦ వలనభయము
రూఢిగ బీదకు ♦ ఋణబాధ భయమును
అన్ని కార్యంబులం ♦ దఖలభయము

గీ॥ గలుగుచున్నట్టి యిహకార్య ♦ గరిమబాపి
భయములేనట్టి వైరాగ్య ♦ పదము నిమ్ము ॥వివిధ॥

సీ॥ క్షీరాబ్ధిశయన నీ ♦ ధీరత్వమును గూర్చి
భజియింపు చుందు నో ♦ బ్రహ్మవినుత
జీవుడెల్లెటపుడు ♦ జింతచేసను గుంది
జడుడనై నీసేవ ♦ జల్పనేమొ
కాల మృత్యునకు ♦ కంఠ వాయువుబట్టి
కఫరోగముల నెల్ల ♦ గల్గుచుండ
సుతులు బంధులు భార్య ♦ హితులు వెతలొందనీ
స్తుతి యొనర్తునో లేనో ♦ సుందరాంగ

గీ॥ గాన యిప్పుడ జేతు మీ ♦ ధ్యానమేను
పూని నను బ్రోవుమింకను ♦ పుణ్యపురుష ॥విధి॥౮౨

సీ॥ హారి హారయనసీవె ♦ సిరివర యనసీవె
గిరిధరయనసీవె ♦ గిరియునీవె
మారా యనినసీవె ♦ శూరా యనినసీవె
వీరా యనినసీవె ♦ ధీరసీవె
శ్రీకారి యనసీవె ♦ నోకారి యనసీవె
పాకారినుతుడీవె ♦ ప్రబలుడీవె
ఆదికాలము నీవె ♦ ఆదిదేవుడవీవె
ఆది మధ్యాంతంబు ♦ లందునీవె

గీ॥ అండ పిండాండమును నీవె ♦ ఆత్మనీవె
దయయు గల్గియు బ్రోచె మా ♦ ధవుడవీవె ॥విధి॥

సీ॥ మితిమీరి నీనామ ♦ స్తుతి యెఱుంగనివారు
పరద్రవ్యముల కాశ ♦ బడెడువారు
భక్తితో నీకీర్తి ♦ భజనసేయనివారు
అనృత వాక్యంబుల ♦ నాడువారు
నీధ్యానమున మది ♦ నిల్పకుండినవారు
హింస కార్యంబు లూహించువారు
హరి నీకథామృతం ♦ బాలకింపని వారు
విప్రనామకులయ్యు ♦ వెలయువారు
గీ॥ ఇట్టి దుర్మార్గులైనట్టి ♦ హీననరులు
కాలకింకర బాధల ♦ గష్టబడరె ॥వివిధ॥ ౮౮

సీ॥ నాతప్పు మన్నింప ♦ నాతండ్రియునునీవ
దాతవై రక్షింప ♦ దైవమీవ
నాకు మోక్షంబిచ్చు ♦ నాదిదేవుడవీవ
నన్ను రక్షించెడి ♦ నాథుడీవ
నామర్గుణము దుంచు ♦ నయ విశారదుడీవ
కర్తవై నన్నేలు ♦ భర్తవీవ
నాకలుష మెడబాపు ♦ పాకారినుతుడీవ
కర్మముల్ బోద్రోయు ♦ ఘనుడవీవ
గీ॥ అఖిల జగదేకకీర్తి ద ♦ యానువర్తి
విడువ నేవేళ నీపాద ♦ విమలభక్తి ॥వివిధ॥ ౮౯

సీ॥ నిండు కానల జేరి ♦ పండుటాకులు దిన్న
వాసిగా విభూతి ♦ బూసియున్న
రుద్రాక్ష హారముల్ ♦ గూఢిగా నొడనున్న
కాషాయ వస్త్రముల్ ♦ గప్పియున్న
యించుక గడ్డంబు ♦ బెంచుక తానున్న
వొప్పుగా జపమాల ♦ దిప్పుచున్న
పద్మాసనస్థుడై ♦ పలుకులాడక యున్న
మౌనంబుతో కన్ను ♦ మూసియున్న

గీ॥ గాని నిశ్చలతత్వంబు ♦ లేని నరుడు
పూని బ్రహ్మైక్యపదవిని ♦ బొంద లేడు ॥వివిధ॥ ౮౬

సీ॥ ఆ కుచేలుని చేతి ♦ అటుకులు దింటివా
యుండగా దై బిడియ ♦ మందకీవు
ఇంగితంబుగ శబరి ♦ యెంగిలిఫలమియ్య
భక్షించితో నీవు ♦ కుక్షి నిండ
ముదముతో కుత వేగ ♦ విదురుని యింటిలో
విందారగించితో ♦ వింతగాను
నిత్యంబు నీదాసు ♦ లత్యంతముగ నిచ్చు
నైవేద్య మందవా ♦ నందముగను

గీ॥ జాతి భేదంబు నీకేది ♦ జగతిలోన
ఆతతంబున నను బ్రోవు ♦ అపరిమేయ ॥వివిధ॥ ౮౭

సీ॥ ఎంక వానల కోర్చి ♦ దండకావనములో
మెండుగా నీ వెట్లు ♦ నుండితయ్యా
నీ తండ్రి మరణంబు ♦ నిజమెరింగిన నాడు
అకట దుఃఖంబెంత నందితయ్యా
సీతను గోల్పోయి ♦ చింతతో జాడ నూ
హించి నీ వెంత శో ♦ కించితయ్యా
అందమౌ ననుజన్ము ♦ డపనిమూర్ఛిల్లిన
ఆ సంకటము నెట్లు ♦ ఆపితయ్యా
గీ॥ అయ్యా యాకష్టములు నీవె ♦ అనుభవింప
చూడగా మాకుచోద్యంబు ♦ సుందరాంగ॥వివిధ॥౮౮

సీ॥ అక్కటా యీజన్మ ♦ మెక్కడ గలిగెనో
ఒక్క రీతిగ బాధ ♦ నొందగల్గె
గతవిత దుఃఖస ♦ న్నికటంబులేగాని
సుఖమొక్క నాడైన ♦ జూచియెరుగ
తాపత్రయాభీల ♦ దావాగ్ని చే గుంది
తల్లడమాయ నా ♦ యుల్లమంత
వ్యాధి బాధితము న ♦ వ్యాకుల చిత్తుడై
వ్యసనంబు జెందితి ♦ వెతల బడితి
గీ॥ దైవమా యేమిశేయు దీ ♦ ధరణియందు
పుట్టనేటికి కడుపులో ♦ గిట్టమేలు ॥వివిధ॥ ౮౯

సీ॥ ఘనతర దుఃఖ భా ♦ జనమైనయా గర్భ
నరక మందే నుండి ♦ నవతరించి
ప్రబలి భవత్వాద ♦ ప్రణాతినల్పక ఘోర
తమునుగు సంసార ♦ భ్రమణదళి
మాయచేజిక్కి నే ♦ మమకారమగ్నుడై
శాంతి హీనుడనయ్యు ♦ చెలగి మిగుల
కర్మాను గుణమున ♦ కడుజ్ఞానశూన్యత
గలిగి దుర్మార్గుడై ♦ కడకు మోహ

గీ॥ పాశబద్ధుండనైన యీ ♦ పాపిజన్మ
మెటుల కడతేర్చిబ్రోతువో ♦ ఇందిరేశ ॥వివిధ॥ ౯౦

సీ॥ నీచవాసన తోలు ♦ నిల నరకాయంబు
లోన దుర్గంధంబు ♦ లొగలుచుండు
తొమ్మిది ద్వారముల్ ♦ నెమ్మిరక్తంబును
పేగు లెముకలతోడ ♦ ప్రబలియుండు
గాసిగల్గిన నొక్క ♦ ఘడియు తాళగలేదు
రయినరగా క్షుద్బాధ ♦ కోర్వలేదు
నిలజాడ్యముల కెల్ల ♦ నిల్లుతానై యుండు
ఉండదు స్థిరముగా ♦ యుర్వియందు

గీ॥ ఘటములోనున్న జీవుడు ♦ గదలినంత
పారవేతురు నింకొక్క ♦ పనికిరాదు ॥వివిధ॥ ౯౧

సీ॥ మోహాభ్రమల చేత ♦ ముక్తిగల్గునటంచు
మురియుచుందురు శుద్ధ ♦ మూఢులయ్యు
నతిదుష్టులై క్రొవ్వు ♦ నధికమై కన్నుల
పొరలుగప్పగ మోహ ♦ పరవశమున
పరహింసలను జేసి ♦ పరనిందలను బొంది
పరభామలను గూడి ♦ పాటుబడుచు
దుర్వాసన సంయుక్త ♦ దురితమేదో మాంస
మత్తువ్కచర్మ మీ ♦ మనుజ తనువు

గీ॥ అట్టితనువులు గోల్పోవు ♦ టరయలేక
జెడితిమిక మేము మిమ్ముల ♦ జేరలేము ॥వివిధ॥ ౯౨

సీ॥ యోగసామ్రాజ్య ప్ర ♦ భోగమందిన వారు
నిశ్చలంబుగ మనసు ♦ నిల్పువారు
గురుపాద పద్మముల్ ♦ గొల్చుచుండెడి వారు
గురుబోధ మదిని నే ♦ మరనివారు
అమిత కారణతత్వ ♦ మనుభవించెడువారు
తమ్ము ధ్యానించుచు ♦ దనరువారు
తాను తానైనట్టి ♦ తత్వంబు గనువారు
అన్యోన్య భవభూతి ♦ నందువారు

గీ॥ దేవ వీరెల్ల నీపాద ♦ దర్శనీయు
లై వెలుంగుదురవ్వేళ ♦ లమలచరిత ॥వివిధ॥ ౯౩

సీ॥ దేవుడు తనయందు ♦ దేదీప్యమానమై
దేఁరిల్లుచు నుండ ♦ దెలియలేక
పొలుపొంద సిలలను ♦ పూజించి దేవుడని
భావించుదురు వట్టి ♦ భ్రాంతిగాక
పుణ్యనిధులంచును ♦ పురములెల్లను దిరిగి
జలము లార్చియు నందు ♦ జంచెవార్చి
ముందుచేశిన కర్మ ♦ ముగిశెనటంచును
మురియుచుందురు శుద్ధ ♦ మూఢులయ్యు
గీ॥ మానస జ్ఞానశుద్ధాత్మ ♦ మరుగెరింగి
లోన బ్రింహంబు వెలిగేది ♦ గానలేరు ॥వివిధ॥ ౬౮

సీ॥ మహిలోన జన్మించి ♦ మరి మోహిగాకను
మాయ సుఖంబెల్ల ♦ మంటగలిపి
మూడవస్థల పొందు ♦ ముమ్మారు విడనాడి
మేటి మంత్రి రహస్య ♦ సూటిదెలిశి
పంచ భూతాత్మల ♦ ప్రబలంబులణచియు
మంచి గురుమూర్తిచే ♦ మర్మమెరగి
ఆశపాశములెల్ల ♦ నంటకుండగ జేసి
నాశికాగ్రము దృష్టి ♦ నాటి నిలిపి
గీ॥ అఖల బ్రహ్మాంబు కళలన్ని ♦ యరసిచూచు
వాడెపో బ్రహ్మవేత్తంచు ♦ వాడెగురుడు ॥వివిధ॥ ౬౯

సీ॥ మాయ కాయపు పట్టి ♦ మరి మోహబీజంబు
ద్రోహమని యెడు సీరు ♦ దోఁపగాగ
మక్కువ యను మొల్క ♦ చక్కగా బెరుగగా
పాలుపొంద కర్మచే ♦ పాడవుగాగ
దుఃఖము లనియెడి ♦ దొడ్డకొమ్మలుచేత
చిక్కగ చింతలే ♦ చిన్నకొనలు
గల్గి వ్యామోహమను ♦ కమలంబు వికసింప
కామ సుఖంబనే ♦ కాయగాయ

గీ॥ ఇట్టి ఫలమనుభవించిరి ♦ యిహము నరులు
గాని తమలోన బ్రహ్మంబు ♦ గానరైరి ॥వివిధ॥ ౯౬

సీ॥ ఐదైదు యిరువది ♦ నైదు తత్వంబుల
అర్థంబు తా దెలిసి ♦ యరువు గాంచి
దశవిధ నాదంబు ♦ దనలోన నాలించి
జూడ సుషుమ్నలో ♦ జూట్టినిల్పి
నిత్యసత్య వివేక ♦ నియతితోడుత ప్రత్య
గాత్మను వీడి పర ♦ మాత్మ గలసి
స్వానుభూతామృతః ♦ సరణితో గ్రోలియు
ధీరుడై యేవేళ ♦ దిరుగవలయు

గీ॥ అట్టివారికి యిలలోన ♦ ఘట్టిగాను
సృష్టితనయందు నగుపడు ♦ సుఖముగాను ॥వివిధ॥ ౯౭

సీ॥ కాయమున్నంతలో ♦ కడు మాయలోబడి
　　పొరలుచుందురు నీదు పొందులేక
అస్తిపంజర సుపరి ♦ శస్త్రమా భూరిమధ్య
　　మహితాంగుగనక దు ♦ ర్మత్తులయ్యి
సంచితంబగు కర్మ ♦ సమితిచే భువిలోన
　　ప్రజలెరుంగరు నీదు ♦ ప్రార్థనంబు
తారకంబును గన్న ♦ తపసిద్ధులను జూచి
　　నెపము లెన్నుచు నుందు ♦ రెవ్వడుజూడ

గీ॥ ఇట్టి దుర్మార్గులైనట్టి ♦ హీన నరులు
　　చూడలేరయ్య నిను కను ♦ చూపులోన ॥వివిధ॥ ౯౮

సీ॥ ఇలభూరుహంబులు ♦ నెన్నియో యుండిన
　　నామమొక్కటిగాదె ♦ నరసిచూడ
పుష్పాలెన్ని విధాల ♦ బూయుచుండినగాని
　　నామ మొక్కటి గాదె ♦ నరసిచూడ
కాయఫలంబులు ♦ కడురీతులెన్నైన
　　నామ మొక్కటి గాదె ♦ నరసిచూడ
గోవుల రకములు ♦ కొల్లగా యుండిన
　　నామ మొక్కటి గాదె ♦ నరసిచూడ

గీ॥ జీవరాసులు వేర్వేరు ♦ భావమైన
　　ఆత్మడన్నిట నొక్కడె ♦ అరసి చూడ ॥వివిధ॥ ౯౯

సీ॥ రవికోటి కాంతులు ♦ రాజిల్లు చున్నట్టి
ఘనకిరీటము వేగ ♦ మున ధరించి
శంఖ చక్రగదాళి ♦ శార్ఙ్గముల్ కరముల
చంద్రకాంతులరీతి ♦ జాలువార
శ్రీవత్స కౌస్తుభ ♦ శ్రీతులసి హారముల్
వక్షస్థలంబున ♦ వన్నెగుల్క
పరగ నీలమురీతి ♦ ప్రజ్వరిల్లెడుకాంతి
నయమైన పాదాంఘ్రి ♦ ద్వయములలర

గీ॥ గరుడ వాహన మెక్కి వే ♦ గమునవచ్చి
కరుణ ప్రత్యక్షమై నన్ను ♦ గావవయ్య ॥వివిధ॥ ౧౦౦

సీ॥ శ్రీకరా దివ్యప్ర ♦ భాకరాభక్తవ
శీకరా సుగుణైక ♦ నాక నిలయ
యేమిరా ననుగావ ♦ వేమిరా నానేర
మేమిరా నాపాలి ♦ స్వామిరార
కోపమా నేజేయు ♦ పాపమా నీకింత
తాపమా నీరూపు ♦ జూపుమయ్య
అక్షీణ సుజన సం ♦ రక్షణాదీక్ష వి
పక్షశిక్షణ జాగ్రు ♦ మో క్షితీశ

గీ॥ వదన జితమారధరమాని ♦ వరదశూర
యేరయిది మేరనన్నేల ♦ యిందురార ॥వివిధ॥ ౧౦౧

సీ॥ ఓపుండరీకాక్ష ♦ యోముని సంరక్ష
యోసచ్చిదానంద ♦ యోముకుంద
యో విమలచారిత్ర ♦ యోవినుత ఘనగాత్ర
యో శత్రుఘ్నపాధీశ ♦ యోపరేశ
యో దుష్టదుదిహార ♦ యో వాలిమర్దన
యో రఘుకులదీప ♦ యోగిసేవ
యోభక్త మందార ♦ యోమేరు సమధీర
యో కరుణాపాంగ ♦ యో కృపాంగ

గీ॥ యేమి యెరుగని వాడను ♦ స్వామినేను
కామితార్థంబు లిచ్చినం♦కరుణజూడు ॥వివిధ॥ ౧౦౨

సీ॥ నీధ్యాన సాగరంబె ♦ నిజముగా నిప్పుడు
నభిషేక మొనరింతు ♦ నయ్యనీకు
నామనోభక్తిని ♦ నయమెుప్పగను వేగ
నూర్థ్వపుండ్రింబుగా ♦ నుంతు నీకు
దీనజనావ నా ♦ జ్ఞాన పుష్పంబుచే
పూజగావింతు రవి ♦ తేజనీకు
ఆత్మాభిరామ నా ఆత్మ జపంబును
నైవేద్య మొనరింతు ♦ నయ్యనీకు

గీ॥ అందముగ నీదుభజనయా ♦ నందమేను
నీకు బలుహారతులు జేతు ♦ నీరజాక్ష ॥వివిధ॥ ౧౦౩

సీ॥ ఘనమేరు సమగాత్రి ♦ దినకర శశినేత్రి
రాజకుల క్షేత్రిశ్రీ ♦ రామచంద్రి
యిభరాడ్గమనలోల ♦ యిందిరా పతిశీల
రారనన్నేల శ్రీ ♦ రామచంద్రి
హరినుత ననుబ్రోవు ♦ స్థిరతరముగ నీవు
ప్రేమ నర్గావు శ్రీ ♦ రామచంద్రి
కరిరాజ వంభీమ ♦ కార్ముక వరసోమ
రఘుకుల ధామ శ్రీ ♦ రామచంద్రి

గీ॥ భూపవర చాపతుత్రిటితస ♦ ద్బోధ చంద్రి
రాక్షస ధ్వంస సర్వేశ ♦ రామచంద్రి ॥వివిధ॥ ౧౦౪

సీ॥ సర్వకాలము లందు ♦ సాకేత నిలయునిన్
సంస్మరించిన జ్ఞాన ♦ సరణి గల్గు
భువనరక్షక యంచు ♦ బొగడు చుండినజాలు
భూరిదోషంబడగు ♦ బుద్ధి గుదురు
హరిరామ గోవింద ♦ అచ్యుతాయని పల్క-
హంకారము లడంగు ♦ హర్షమొదవు
ఫాలాక్ష వినుత నీ ♦ పాదముల్ పూజింప
పలుమారు జన్మముల్ ♦ పరగరావు

గీ॥ వేద వేదాంత నిన్ను నే ♦ వేడుచున్న
వెలయ లేనట్టి పదమబ్బు ♦ వెరువనేల ॥వివిధ॥ ౧౦౫

సీ॥ వైకుంఠు సేవేళ ♦ వనగ పూజించిన
వైష్ణవ కులశీలు ♦ డోబిళార్య
డతనికి ప్రియపత్ని ♦ అతిధర్మ గుణశాలి
సాకమాంబయనంగ ♦ సత్యవతియు
ఆ పతీవ్రతకు నే ♦ ననువంద పుత్రుడై
శ్రీరామ భక్తుడై ♦ చెలగు చుండ
ధరలోన ప్రజలెల్ల ♦ దయగల్గియును చాల
నరసింహదాస నా ♦ నన్ను బిలువ

గీ॥ దాస దాసుల కెల్ల నే ♦ దాసుడైతి
ముక్తి గొనుటకు శ్రీహరి ♦ భక్తుడైతి ॥వివిధ॥ ౧౦౬

సీ॥ ఒప్పుగా కొమరుండు ♦ జెప్పిన పద్యముల్
తప్పు లేమున్న నీ ♦ వొప్పుకొనుము
జ్ఞానంబు లేదు ని ♦ దానంబు లేదు నీ
ధ్యానంబనే మంచి ♦ ధ్యానగాని
భూరి విద్యయురాదు ♦ బుద్ధియూహాయు లేదు
శాస్త్ర పద్ధతులెవ్వి ♦ జడివి యెరుగ
నేరంబు లెన్నున్న ♦ భారంబు నీదెగా
ఫాలాక్షు వినుత స ♦ త్ప్రాల పలక

గీ॥ అయ్య నీభక్తి గాక నే ♦ నన్య మెరుగ
అవ్యయానంద గోవింద ♦ హరిముకుంద ॥వివిధ॥ ౧౦౭